కాలు తీసెయ్యకుండా నయం చేయవచ్చు నని అంటే వినరు. అది తెమల్చుకొనేటప్పటికి ఇంత ఆలస్యమైంది."

"మీ ఆవిడ సలహా పుచ్చుకొని వచ్చారేమో ?" అంటూ గోపాల్ నవ్వాడు.

"ఏమని ?" డాక్టరు అడిగాడు.

"అదికాదు, మీ ఆవిడ కళ్ళజబ్బు నయంచేసుకోవటానికి వచ్చినప్పుడు ఏమనిచెప్పావు ? జబ్బు నయంకాదని స్పష్టంగా చెప్పావు. అలాగే జరిగింది. కళ్ళు పోయాయి, ఆ అమ్మాయి గతి ఏంకానని పెండ్లిచేసుకొన్నావా ? అలాగే ఒక వేళ ఈ అమ్మాయి కాలు తీసివేయవలసివచ్చినా భయంలేదు, ఎవరు దొరకకపోయినా నువ్వుంటావుగా," అంటూ గోపాల్ నవ్వాడు. గోపాల్ నవ్వు తెలిసిందేగా, రిజర్వుడంతా మావంక తిరిగి చూచింది. ఆ నవ్వుతో నాకు నవజీవాలు కుంగిపోయాయి. సినిమా ఎంతసేపాడింది ? ఎప్పుడయిపోయింది ? తెలియలా. హాలులో లైట్లు వెలిగాయి. డాక్టరు నా చెయ్యి పుచ్చుకొన్నాడు. బయటికి వచ్చాము.

గోపాల్ సెలవు తీసుకొని మరొకదారిన వెళ్ళాడు. అతడు ఎంత నిర్లిప్తుడు ! ఎంత ప్రతిభాశాలి ! లోకాన్ని నాకు అర్థమయ్యేట్టు చేశాడు. అందుకే అతడంటే గౌరవం—అతడంటే భక్తి.

ఏప్రిల్, 1947

# వేదాంతి

ఊళ్ళోవాళ్ళంటే వెంకన్నగారికి ఒకటే జిలి. ఎప్పుడూ, అది లేదనీ, ఇది లేదనీ, రోగాలనీ, నొప్పులనీ ఎందుకు అవస్థపడుతుంటారో ఆయనకు అర్థంకాలేదు. వాళ్ళకు తెలీక అలా ప్రాకులాడుతున్నారను కోవటానికి అవకాశం కనిపించలేదు. తెలియనప్పుడు పెద్దవాళ్ళనడిగి తెలుసుకోవచ్చునా ? లేదు. ఈ కాలానికి అది అసలు పనికే రాదు. ఒకళ్లు చెప్పటం, మరొకరు వినటమా ? ఛీఛీ, ఎవరికి ఎంతతోస్తే అంత. అది తప్పైనా ఒప్పైనా అలా జరిగిపోవలసిందే. కాస్త అనుభవం ఉన్న వాళ్లు, పెద్దవాళ్లు "అలాకాదురా నాయనా, ఇలా," అని చెప్పటానికి వీలు లేదు. వీలుచేసుకొని చెప్పినా మర్యాద దక్కదు.

మొన్న మట్టుకు మొన్న, పురుషోత్తం కొడుకు ఏమిచేశాడు ? తీరాచూస్తే భూమికి జానెడు లేడు. వాడికి భూమిమీద కాలు ఆనదు. బడినుంచి యింటికి వస్తుంటే మాత్రం మెల్లగా రాకూడదు ? ఆ గాడిద పరుగు దేనికి ? పడితే ఆ పలకా, సిరాబుడ్డీ—అవి ఏమౌతాయి ? కొత్తగా వచ్చినపళ్ళు ఉంటాయా, ఊడతాయా ? బుద్ధిచెప్పవలసిన వెంకన్నగారు చూస్తూ ఊరుకోవటం ధర్మమా ?

"ఒరే గాడిదా, ఎందుకురా ఆ పరుగులు ? గుర్రాన్ని కాస్త కట్టెయ్యి," అన్నాడు. అంతమాత్రానికి వాడేమన్నాడో తెలుసా ?

టక్కున నిలబడి చేతులు జోడించి "కొత్తపంతులుగారూ! నమస్కారమండి. దారిలో ఇంకొక బడి పెడతారనుకోలేదు," అంటాడా?

అంతే, వట్టి పితపకాలం. ఇవి ఒకళ్ళకు చెప్పేరోజులు కావు. వినుకోనేవి అంతకన్నా కావు. తన చిన్నతనంలో ఈ పచ్చికలి లేదు. ఆనాడు పెద్దవాళ్ళను ఆ దున్నపోతులాగా వెక్కిరించేవాళ్ళా? పెద్దవాళ్ళు కూకలేస్తే గుడ్లప్పగించి చూచేవాళ్ళు. మరి చిన్నపిల్లలైతే గజగజలాడిపోయేవాళ్ళు. నిజానికి కొందరు ఒంటేలు కూడా పోసుకొనేవాళ్ళు.

ఆ రోజులన్నీ పోయాయి. పెద్దవాళ్ళంటే గౌరవం లేదు. ఆ ఆచారాలు, ఆ సాంప్రదాయాలు, ఆ భావ, ఆ సంస్కారం, ఆ కట్టు, ఆ బొట్టు, ఆ నడవడీ ఈనాడెవరికీ అక్కరలేదు. ఈ లేత బొప్పిలకు తోచిందే సత్యం; వాళ్ళు నడిచినదే బాట. మాట మాట్లాడితే సహేతుకమనీ, సమంజసమనీ, అభ్యుదయమనీ అంటారు. అసలు వాళ్ళ బుద్ధి ఎంత? వాళ్ళ అనుభవం ఎంత? పూర్వులు చెప్పిన దాన్ని ఆలోచించటానికైనా తమకు తాహతు ఉందో లేదో ఆలోచించారూ? ఆమాత్రం తోస్తే బ్రతికే పోదుముగా.

ఇంత పచ్చికలి ఎన్నడూ లేదు. వెంకన్నగారు తమ నలభై ఐదు ఏళ్ళ జీవితంలో ఎప్పుడైనా జరిగిందేమోనని ఒకసారి సింహావలోకనం చేసుకొన్నారు. తమకు ఊహ వచ్చినప్పటినుంచి ఇలాంటిది జరగలేదు. పెద్దవాళ్ళుకూడ తమ కాలంలో ఇలా జరిగినట్లు చెప్పలేదు. నేడు ఇంత విరగబాటు, పెద్దలంటె ఇంత అలుసు దేనికి? ఈ మూన్నాళ్ళ ముచ్చట్లే శాశ్వతమా? నరకకూపంలాగా ఉన్న యీ నరజన్మ, ఈ ఆడపాటు, ఈ మగపాటు పరమార్థాలా!

మనకళ్ళముందే ఐశ్వర్యాలు అంతరిస్తున్నాయి. వజ్రకాయములు జర్జరితమై పోతున్నాయి. ఇవ్వాళ కనిపించినవాళ్ళు రేపు కనిపించటం లేదు. ఎందుకుపోతున్నవో ఎక్కడకు పోతున్నవో వాళ్ళలో ఎవరైన ఆలోచిస్తున్నారా? లేదు లేదు. అలాంటి ఆలోచనే ఉంటే ఈ

అదిరిపాటు ఉండదు. పెద్దలన్నా, వాళ్ళ సలహాలన్నా యింత తిరస్కారం ఉండదు.

ఇదంతా ఎందుకు జరుగుతున్నది? వెంకన్నగారు ఆలోచించారు. అధికారులకు పూర్వ సాంప్రదాయాలమీద, సంస్కారాలమీద గౌరవం లేదు. పైగా ఇంగ్లీషు చదువులు వచ్చిపడ్డాయి. వాటి వల్లనే పూర్వ సంస్కృతి సాంప్రదాయాలమీద గౌరవం పోతున్నది. కుక్క గొడుగుల్లాగా తొర్రి మొర్రి ఆలోచనలు బయలుదేరుతున్నవంటే ఈ చదువులే కారణం.

ఈ నిర్ధారణకు రాగానే వెంకన్నగారు వెంటనే ఇంగ్లీషు మానిపించి కొడుకు సుబ్బరాయలను శాస్త్రులవారి వద్దకు పంపించాడు. అంతటితో తన బాధ్యత తీరిపోలేదని తెలుసుకొని, తత్త్వగ్రంథాలు తిరగవేశాడు. జగత్తు మిథ్య అనీ, జ్ఞానమొక్కటే సత్యమనీ, అది స్వతః ప్రమాణమనీ. అనవచ్ఛిన్నమనీ చదివినప్పుడు అతని హృదయం లేచివచ్చింది. తాను ఇంతకాలం స్పష్టంగా విప్పి చెప్పలేని పరమార్థాలను పెద్దలు ఎంత తేలికగా, ఎంత చిన్నమాటలతో చెప్పగలిగారు?

వెంకన్నగారికి ఎక్కడలేని ఉత్సాహం బయలుదేరింది. ఆయన సునిశితబుద్ధి దీర్ఘంగా ఆలోచించటం మొదలుపెట్టింది. ఒక్కొక్కప్పుడు ఆకలి దప్పులు గూడ స్పృహకు వచ్చేవి కావు. జ్ఞానం ఎదుగు బొదుగులు లేని అఖండ సత్పదార్థమైనప్పుడు పరిణామం ఎక్కడనుంచి వస్తుంది? అలాంటిది ఉండటానికి వీలులేదు. కాదు పరిణామం ఉంది అంటే అది నవ్యుల అహంకారం. పూర్వులకంటె తాము తెలివిగలవాళ్ళమన్న దురహంకారం. అంతకు తప్ప మరేమీ లేదు. జ్ఞానం పరిణామ రహితమై అఖండంగా అనాదినుంచే ఉంటున్నప్పుడు పూర్వులే దాన్ని తెలిసికొని ఉండాలి. ఇవ్వాళ కొత్తగా కనుక్కోవటానికి వెనుక లేనిదయితే గదా. అందువల్ల పరమసత్యం ప్రాచీనతమం కావాలి.

ఈ అభిప్రాయం కలగగానే వెంకన్నగారికి ఒక్కసారి జ్ఞానోదయమైనట్లయింది. ఆవరించిన అజ్ఞాన మేఘాలు విరిసినట్లయింది. సత్యమంతా ఒక్కసారి ప్రకాశించినట్లయింది.

వెంకన్నగారు అప్పుడప్పుడు తెలుగుభారతం చదువుతూ నన్నయ తిక్కన కవిత్వాలలోని తారతమ్యాన్ని కొడుకు సుబ్బారాయలకు వివరించి చెప్పేవాడు. నన్నయభట్టారకుడు, తిక్కనసోమయాజి కంటె ప్రాచీనుడు. ఎప్పుడైనా ప్రాచీన కవిత్వం ప్రాచీనకవిత్వమే; నవ్యుల కవిత్వం నవ్యుల కవిత్వమే. ప్రాచీనుల కవిత్వంలో ఆ గంభీరత, ఆ ధారావాహకత్వం, ఆ రసవత్తు, ఆ విద్వత్తు, నవ్యులకు రావు. నన్నయ భట్టారకుని కవిత్వం చదువుతుంటే సాక్షాత్తు ఋక్కులు చదువుతున్నట్లుంటుంది. ఆ కవితాధార అనర్గళం, ఎక్కడా పొల్లు ఉండదు. "శ్రీపతి వోని కుంతమును జెల్వగు మాద్రియు వెంటరా", అన్నప్పుడు శ్రీపతి అనీ, చెల్వు అనీ ఎంత సాభిప్రాయంగా నన్నయగారు వాడారు. ఆయన నిజంగా ఋషి. తిక్కనగారు అలాకాదు. ఉదాహరణకు ఆయన వాడిన "సుఖశ్రీవిభవ" మన్న సమాసమే తీసుకో. శ్రీ అంటే ఏమిటి ? విభవమంటే ఏమిటి ?— ఇలాంటి పడికట్టు రాళ్ళే ఉంటాయి. పద్యం ముగియకపోతే కౌరవనాథా అనో, ఇభపురనాథా అనో అంటాడు. పద్యం ఎప్పుడూ సాఫీగా నడవదు. నన్నయగారి పద్యంవలె చటుక్కున బోధపడదు. అంతమాత్రాన తిక్కన గారిని తీసివేస్తున్నాననుకోకు. తరువాత వచ్చిన కవులకంటె ఆయన ఎన్నో రెట్లు అధికుడు. ఎప్పుడన్నా చూడు. ప్రాచీనకవిత్వం ప్రాచీనకవిత్వమే, నవ్యులకవిత్వం నవ్యుల కవిత్వమే.

సుబ్బరాయలు తన తండ్రి సూక్ష్మబుద్ధికి ఆశ్చర్యపోయాడు. అలాంటిఅభిప్రాయాలు తనకే ముందుగా తట్టి, తండ్రిగారికి తనే ముందుగా చెప్పిఉంటే ఎంత బాగుండేదని ఉబలాటపడుతుండేవాడు. ఇలాంటి ఉబలాటంకొలది భిన్న భిన్న కవుల మారుమూల పద్యాలు వ్రాసుకొని సుబ్బరాయలు తండ్రికి చూపించి, ఏవి బాగున్నాయో చెప్పమనేవాడు. వెంకన్నగారు వాటిని చదివించుకొని దడదడా విని

పించిన పద్యాలు బాగున్నవనేవాడు. "కాదునాన్నగారూ, ఆ పద్యాలు రామభద్రుడివి, మిగతావి ఎఱ్ఱాప్రెగడవి," అనేవాడు సుబ్బరాయుడు. వెంటనే వెంకన్నగారు "రామభద్రుడి పద్యాలు బాగానే ఉన్నాయి. ఎఱ్ఱాప్రగడ ఎంత తేలికగా చెప్పాడో చూడు. మామూలు మనిషి కూడ అర్థమౌతాయి. కవిత్వం అంటే అలాఉండాలి," అనేవాడు. సుబ్బరాయుడుకు మంచి కవిత్వం లక్షణాలు ఎలా ఉంటాయో తెలుసు కోవటం కష్టమని అప్పుడు తెలిసింది. తన తండ్రి అంత అనుభవం, సుని శితబుద్ధి, అభిరుచి సంపాదిస్తేనేకాని లాభం లేదనిపించింది. వాటిని సంపాదించాలని ప్రయత్నిస్తూ వచ్చాడు.

కాని ఇంతలో ఊళ్ళో హైస్కూలు పెట్టారు. ఇంతలేసి వాళ్ళు అంతలేసి వాళ్ళుకూడ స్కూల్లో చేరి చదవటం ప్రారంభించారు. వాళ్ళ చేతుల్లో లావాంటి పుస్తకాలు, జేబుల్లో ఫౌంటెన్ కలాలు, నెత్తిన క్రాపులు కనిపిస్తుండేవి. అందరి దగ్గర డబ్బు మెదలుతుండేది. ఇవన్నీ చూస్తున్న సుబ్బరాయుడుకు పెరపెరలు పుట్టేవి. అప్పుడప్పుడు హైస్కూలు కుర్రాళ్ళు తన్నుచూచి ఇంగ్లీషులో ఏమేమో చెప్పుకొని నవ్వుకొంటూ ఉండేవాళ్ళు. బహుశా తన పిలకచూచే నవ్వుతున్నా రేమో! ఈ అనుమానం తగలగానే సుబ్బరాయుడుకు మనస్సుమరీ చివుక్కుమంది. తనుగూడ ఇంగ్లీషు చదువు కొంటేనో?

సుబ్బరాయుడు తండ్రిగారిని అడుగుదామనుకొన్నాడు. తీరా అడిగితే కాదంటాడేమో! ఈ సందేహంతో ఒకటిరెండు రోజులు తట పటాయించాడు. అడిగితే తండ్రిగారు కాదంటారేమో, దానివల్ల వచ్చే నష్టమేముంది? ఈ ఆలోచన తట్టగానే అతడు ఒకనాడు సాయం కాలంవెళ్ళి వీధి అరుగుమీద కూర్చున్న తండ్రిగారి ప్రక్కన చతికిల బడ్డాడు. కొడుకు ముఖంచూచి వెంకన్నగారు "ఏమిటి విశేషం?" అన్నాడు.

"అందరూ కొత్తస్కూల్లో చేరుతున్నారు," అన్నాడు సుబ్బ రాయుడు.

"అయితే ఏమంటావు?" అన్నాడు వెంకన్నగారు

"అవధాన్ల గారబ్బాయి కూడ చేరాడు, నాన్నగారూ!"

"ఇంతకూ నేనుకూడ చేరతానంటావు, అంతేనా?" వెంకన్న గారు గద్దించాడు.

సుబ్బరాయలు మళ్ళా నోరు మెదపలేదు. కాసేపుఆగి వెంకన్న గారు నింపాదిగా అన్నాడు "ఒరే చూడు, పెద్దవాణ్ణో, చిన్నవాణ్ణో చెబుతున్నాను. మానవజన్మ మెత్తినందుకు ఇహమొక్కటే కాదు. పరంకూడ చూచుకోవాలి. ఈ ఇంగ్లీషు చదువులవల్ల వచ్చేదేముంది? ఎటు దిరిగి అందరికీ ఉద్యోగాలురావు, వస్తాయేపో, అవి శాశ్వతమా? పరమార్థాలా? సంస్కృతమే చూడు. ఇటు లౌకికానికి, అటు పార మార్థికానికీ పనికివస్తుంది. ఇవ్వాళ నామాటలు నచ్చకపోయినా రేపైనా నీకు తెలిసిరాకపోతుందా!"

ఈ మాటలు విన్న తరువాత సుబ్బరాయలు తండ్రి దగ్గర ఇంగ్లీషు చదువు సంగతి మళ్ళాఎత్తలేదు. శాస్త్రులవారి వద్ద నైషధం ప్రారంభిం చాడు. వెంకన్నగారికి కనీసం తన కొడుకైనా తనమాట విన్నందుకు సంతోషం కలిగింది. ఇలా ఆర్షధర్మం కొంతలో కొంతైనా సాగుతుండ బట్టే ప్రపంచం ఇంకా నిలిచి ఉందని బోధపడింది. ఈ సంగతి తెలిసి వచ్చిం తరువాత వెంకన్నగారు తమ ఆర్షధర్మాన్ని యథోచితంగా అనుష్ఠిస్తూ వచ్చాడు.

ధర్మ విహితానుష్ఠానంలో మునిగితేలుతూ వచ్చిన వెంకన్నగారి భార్యకు దగ్గూ జ్వరం ప్రారంభమయ్యాయి. అయినా ఆమె తన ఆచా రాలు మానుకోలేదు. వెంకన్నగారు ఆచార్లుగారి మాత్రలు తెచ్చి యిస్తూనే వచ్చాడు. కాని ఆమెకు జబ్బు నానాటికి ప్రబలమై మంచంలో నుంచి లేవలేని పరిస్థితి ఏర్పడింది. సుబ్బరాయలే వంటచేస్తూ వచ్చాడు. అయినా తల్లికి స్వస్థత చిక్కలేదు. అతనికి వంటచేయటం కంటె రాత్రంతలు తల్లి పడుతున్న బాధే దుర్భర మనిపించింది. ఒకనాడు తల్లి మంచంవద్ద కూర్చుని సపర్యలు నడుపుతున్న తండ్రితో చూచా

యగా అన్నాడు. "నాన్నగారు, కొత్త డాక్టరుగారి చేతివాసి మంచి దంటున్నారు."

వెంకన్నగారు మాట్లాడలేదు.

"ఎటువంటి రోగాలు కూడ నయమై పోతున్నవని అంతా చెప్పుకొంటున్నారు," అన్నాడు సుబ్బరాయలు.

"ఒరే సుబ్బులూ, డాక్టర్లు దేవుళ్ళటరా! ఎవరికర్మ ఎవరు మారుస్తారు? అసలు పూర్వసంచితం అనేది ఒకటి ఉంటుందంటావా?" అన్నాడు వెంకన్నగారు.

సుబ్బరాయలు కుక్కిన పేనయ్యాడు. చెమ్మగిల్లిన కన్నులతో తల్లిని చూచాడు. ఆమె మాట్లాడలేదు. వెంకన్నగారు భార్యకు ఆచార్యుల వారి మాత్రలు ఇచ్చి సపర్యలు నడుపుతున్నాడు. అయినా కర్మ బలీయంగా ఉండటంవల్ల ఆమె పతిసేవలు వదలిపెట్టి పోయింది.

భార్య పోయినప్పటినుంచి వెంకన్నగారికి ప్రాపంచిక విషయాల నశ్వరత్వం మరీ స్పష్టమై పోయింది. ప్రతి దానిమీద విరక్తి కలిగింది. తనదగ్గరకు వచ్చే వారందరికీ తన అనుభవాన్ని వివరించి చెబుతూ వుండేవాడు.

ఇంతలో ఆయన రొమ్మున ముక్కుమొనలేని గడ్డలేచింది. అది మొదట్లో బాధపెట్టలేదు. అందువల్ల వెంకన్నగారు త్రోసివేసుకు తిరుగుతూవచ్చాడు. కాని అది నానాటికి ప్రవర్థమానమౌతూవచ్చింది. దానితో ఆయన ఆచార్లవారి వద్దకు రేపుమాపులు వెళ్ళివస్తూ వచ్చాడు. దాన్నిబట్టి ఆయనకు ప్రాణభయం కలిగిందనుకోవటం చాల పొరపాటు. మానవ జన్మమెత్తినందుకు పూర్వజన్మ సంచితం విరగడ చేసుకోవాలా! ఆత్మస్వరూపం తెలుసుకొని బ్రహ్మానుభూతి పొందనిదే జన్మరాహిత్యాం ఎలా లభిస్తుంది? కొడుకు సుబ్బరాయలు ఇంకా సూత్ర భాష్యం పూర్తిచేయలేదు. ముందుగానే జన్మచాలిస్తే ప్రయోజనమేముంది?

ఈ ఉద్దేశంతో వెంకన్నగారు ఆచార్లువారి వద్దకు వెళుతుండే వాడు. ఆయనకూడ ఈ లేపనం కాదని ఆ లేపనం, అదికాదని పసరులు పూసి ఎన్నోతంటాలు పడ్డాడు. తల్లక్రిందులుగా తపస్సు చేశాడు. కాని ప్రయోజనం లేకపోయింది. పూర్వసంచితం అంత బలీయంగా ఉన్నప్పుడు ఆచార్యులవారు మాత్రం ఏం చేస్తారు ?

వెంకన్నగారి గడ్డ ఇంతై అంతై నభమంతకాదు కాని, తాటి కాయంతై ఊరుకొన్నది. వేరేబాధ ఏమీలేదు. కాస్త గట్టి వస్తువు తాకినప్పుడు మాత్రం కొంచెం నొప్పి అనిపించేది. అయినా ఆయన నిత్య వ్యవహారానికి ఆటంకం కలగలా. ప్రతిరోజు జగత్తు మిథ్య అనీ, జ్ఞానం ఒక్కటే నిత్యమనీ, పామర లోకానికి వీలు చిక్కినప్పుడల్లా బోధిస్తూనే ఉన్నాడు.

ఒకరోజున వీధి అరుగుమీద కూర్చుని దస్తావేజు చదివిపెట్టమని వచ్చిన కాపుకు వెంకన్నగారు ప్రపంచ మిథ్యాత్వం వివరించి చెబుతుండగా ఒక జంగమదేవర వచ్చి "శంభో మహాదేవ్" అంటూనే బయ్యిన శంఖు పూరించాడు. "అబ్బ ఆపవయ్యా, కాస్త ఆపు," అంటూ వెంకన్నగారు భిక్ష తెచ్చి పెట్టటానికి లేచాడు. లేవగానే కప్పుకొన్న ఉత్తరీయం కొంగు ఒకప్రక్కజారి గడ్డ జంగమదేవర కంటపడ్డది. వెంటనే అతడు "కాస్తయిటు మళ్ళండి," అన్నాడు. విస్తుపోయి వెంకన్నగారు జంగం వైపుతిరిగాడు.

"ఆ గడ్డలేచి ఆరునెల్ల పదిహేను రోజులయింది కదూ?" అన్నాడు జంగం

"ఆఁ. ఆఁ. ఒకటిరెండు రోజులకేంగాని అంతే" అన్నాడు ఆశ్చర్యచకితుడైన వెంకన్నగారు.

"మీరు మరొకసారి జ్ఞాపకం తెచ్చుకోండి. ఆ గడ్డ లేచి ఆరునెల్ల పదిహేను రోజులకన్న ఎక్కువ కావటానికి వీలులేదు," అన్నాడు జంగం.

వెంకన్నగారికి పంచప్రాణాలు లేచివచ్చాయి. అంటే బాధ విరగడై పోతుందన్న ఆస గాదు. పూర్వజన్మ సంచితం విరగడై జన్మ

రాహిత్యానికి ఈ జన్మలోనే అవకాశం లభిస్తుందని ఆయన సంతృప్తి. కాపును పంపివేసి వెంకన్నగారు జంగమదేవరతో బేరమాడాడు. జంగం యాభైరూపాయలు కట్నం మడిగాడు. అటుగీసి ఇటుగీసి వెంకన్న గారు అతన్ని ముప్పైరూపాయలకు ఒప్పించాడు. ముందు పదిరూపాయ లిచ్చేట్టు, పూర్తిగా నయమయ్యాక మిగత ఇరవై ఇచ్చేటట్టు. "జ్ఞాన పత్రంకూడ దయ చేయించాలి," అన్నాడు జంగం. "సరే అలాగే కాని," మ్మన్నాడు వెంకన్నగారు.

మంచిరోజు చూచి వచ్చి జంగం వెంకన్నగారికి వరుసగా మూడు రోజులు పట్టీలు వేసి పోతూ వచ్చాడు. నాలుగోనాటికి గడ్డపై చర్మం చిట్లింది. ఆ రోజున వెంకన్నగారి సంతోషానికి మేరలేక పోయింది. జంగం కొత్త పట్టీవేసి, జ్ఞానపత్రం మరికొంచెం అధికంగా పుచ్చుకొని వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి వెంకన్నగారికి కలిగిన ఆ నూతన అనుభూతి చెబితే అర్థమయ్యేది కాదు. ఆయన మంచంలో దొర్లినవాడు దొర్లినట్టుగానే ఉన్నాడు. తెరచినకళ్ళు తెరిచినట్టుగానే ఉన్నాయి. ఆ ఉదయాన కొడుకును పిలిచి వెంకన్నగారు "ఒరే సుబ్బులు, మధుసూదన సరస్వతి కాలం మిథ్య అన్నాడుటరా?" అని అడిగాడు. సుబ్బరాయలు 'అద్వైత సిద్ధి' తెరచి, ఆ పంక్తులు చదివి వినిపించి, "ఆసందేహం మీకెందుకు కలిగింది?" అని అడిగాడు. "ఏమీలేదు, నేనేమన్నా పొరపాటు పడ్డానేమోనని అడుగుతున్నాలే," అన్నాడు వెంకన్నగారు.

జంగం ఆ పూట కూడ వచ్చిచూచి, చెప్పిందంతా విని మళ్ళీ పట్టీ వేసిపోయాడు. ఆ రాత్రి వెంకన్నగారికి పూర్తిగా అనిమిషత్వం సిద్ధించింది. అనిమిషత్వం సిద్ధించిన తరువాత వైద్యుడు దేని కన్నట్లుగా జంగం మళ్ళీ ముఖం చూపించలేదు.

పైచర్మం చిట్లిన గడ్డ చీముపట్టి వెంకన్నగారికి తీపులు ఎక్కువయ్యాయి. దానితో ఆయనకు తెలియకుండగానే మాడ్పులు పొడ సూపసాగాయి. తన మంచంవద్దనే కాపెట్టుకొని సకల సపర్యలు చేస్తూ

వున్న సుబ్బరాయలను వెంకన్నగారు గద్దించటం, చెడామడా తిట్టటం సాగించాడు. సుబ్బరాయలు విస్తుపోయి చూస్తూ ఉండేవాడు.

రోజులు గడిచిన కొలందికీ — అసలు గడిస్తేనా — వెంకన్నగారికి బాధ ఎక్కువ కాసాగింది. దానితో 'జగత్తు, మిథ్యేనా? తాను పడుతున్న అవస్థ యిలావుందేమి?' అన్న సందేహాలు మొలకలెత్త సాగాయి. ఒకరాత్రి బాధ మరీ ఎక్కువై "ఒరే సుబ్బులూ!" అని కేక పెట్టాడు. అప్పుడే కునుకుపాట్లు పడుతున్న సుబ్బరాయలు అదిరిపడి "ఏమిటి నాన్నగారూ!" అంటూ దగ్గరకు వచ్చాడు.

"ఒరే నేను బ్రతకనురా. ఒకసారి ఆ కొత్తడాక్టర్ను పిలుచుకు రారా," అన్నాడు వెంకన్నగారు.

సుబ్బరాయలు తన చెవుల్ని తానే నమ్మలేకపోయాడు. తండ్రిగారు తెలివిలో ఉండే మాట్లాడుతున్నారా అనే సందేహం కలిగింది. వెంకన్నగారు మళ్ళీ అదే ప్రాథేయపడుతూ అడిగాడు.

"నాన్నగారూ! డాక్టర్లు దేవుళ్ళా? ఎవరి కర్మను ఎవరు మారుస్తారు? అసలు పూర్వజన్మ సంచితం నశించందే ప్రయోజనమేముంది? అది నశించకపోతే మళ్ళా జన్మ తప్పదు. ఇలాంటి నరకం తప్పదు," అన్నాడు సుబ్బరాయలు.

"అరే కాస్త కని పెంచిన వాణ్ణని అయినా చూడరా. నా గతి ఎలా ఉంటే అలా అవుతుంది. కనీసం నీకున్న పుత్ర ధర్మాన్నైనా తీర్చరా," అన్నాడు వెంకన్నగారు.

"ఇంత అనుభవం వచ్చిన తరువాతగూడ పొరపడుతున్నారేమిటి? శంకర భగవత్పాదుల వాక్యాలు మరచిపోయారా. వాడు తండ్రి, వాడు పుత్రుడు, వాడు శత్రువు అనుకోవటం కన్న వ్యామోహం మరేముంది?" అని జ్ఞాపకం చేశాడు సుబ్బరాయలు.

## ఉదబిందువులు

వెంకన్నగారు మళ్ళా మాట్లాడలేదు. నాలుగురోజులు ద్గొర్లి గింతలు పెడుతూ అరుస్తూ వచ్చాడు కాని పల్లెత్తుమాట అనలేదు. అయిదోరోజు తెల్లవారుజామున కొడుకును లేపి "ఒరే సుబ్బులు, జగత్తు మిథ్య; నేను, నాది, నావాడు అనుకోవటం వున్నదే, అది వట్టి వ్యామోహం", అని కళ్ళు తేలవేశాడు.

—నవంబరు, 1947

# పాత్రలు

| | |
|---|---|
| వ్యాసుడు | సుమంతుడు |
| జైమిని | భృగువు |
| దేవలుడు | విశ్వనాథుడు |
| నందీశ్వరుడు | అన్నపూర్ణ |
| వైశంపాయనుడు | ప్రమథనాథుడు |

ఇంకా ఇద్దరు బ్రహ్మచారులు

## కాశీనగరం:

1. గురుకులం
2. బ్రాహ్మణవాటిక
3. విశ్వనాథుని ఆలయం

# భిక్షాపాత్ర

(ప్రణికర్ణిక. ప్రక్కనే గురుకులం. చాలా విశాలంగా వుంటుంది. దూరాన్నుంచి చూస్తే చెట్లతోపుగా కనిపిస్తూ వుంటుంది. ఎక్కువగా వేపచెట్లు, వటవృక్షాలు. గురుకులంలో ఒకమూలగా వేపచెట్టుకు దగ్గరలో వ్యాసుని కుటీరం. దానికి కొంచెం దూరంలో జైమిని కుటీరం. దానికి ప్రక్కనే విద్యార్థులు చదువుకోటానికి రెల్లుతో నేసిన పాకలు పది పన్నెండు ఉన్నాయి. ఈ కుటీరాలమధ్య పెద్ద అశోకవృక్షం. గురుకులమంతా అప్పుడప్పుడు ఇక్కడే కలుసుకొంటూ వుంటుంది. వ్యాసుని ఉపన్యాసాలకు విద్యార్థులంతా ఇక్కడికే వస్తారు. దీన్నే 'ముక్తిమంటపి' అంటారు. పురాణ పఠనం మహర్షుల వేదాంత చర్చలు ఇక్కడే జరుగుతాయి. వ్యాసుని గ్రంథాలకు ప్రతులు ఇక్కడినుంచే వ్రాసుకపోతారు.

ముక్తిమంటపికి ముందు అక్కడక్కడా చెట్లున్నాయి. మధ్యమధ్య మందార వృక్షాలు, మల్లెతీగలు, గులాబి మొక్కలు, సన్నజాజి పొదలు, వాసంతీ కుంజాలు ఉన్నాయి. బ్రహ్మచారులు చెట్లక్రింద చేరి పాఠాలు వల్లించుకొంటూ వుంటారు.

ఈ చెట్లలో వున్న మామిడిగున్న క్రింద సుమంతుడు, భృగువు, నందీశ్వరుడు, దేవలుడు కూర్చుంటారు. హెచ్చుతగ్గుగా వీరందరూ

సమవయస్కులు. అందరికీ గోష్పాదములంత పిలకలున్నాయి. నూనూగు మీసాలు, మెళ్ళో రుద్రాక్ష మాలలు, చెవులకు రుద్రాక్ష కుండలాలు. అందరివీ పింజలువోసి కట్టిన నీరుకావి దోవతులు, మీను మీసాలవంటి యజ్ఞోపవీతాలు, ఒంటినిండా విభూతి రేఖలు.

సుమంతుని విభూతిరేఖలు చెమటతో మాసి కనబడకుండా వుంటాయి. కన్నులు వెలవెల పోతుంటాయి. నందీశ్వరుడు ప్రక్కన వున్న మల్లెతీగవంక చూస్తూ వుంటాడు. భృగువు ముఖంతిప్పి విచారంగా చూస్తూవుంటాడు. దేవలుడు చిరాకుగా వుంటాడు. మంచి తెలివి తేట లున్నాయి. ఇతడంటే బ్రహ్మచారుల కందరికి అసూయ, ఒకవిధమైన గౌరవం, అసహ్యత. ఇతని దగ్గర నందీశ్వరుడు తప్ప ఇతరులు నోరు విప్పటానికి జంకుతారు.

రెండు నిమిషాలు ఎవ్వరూ మాట్లాడరు. అంతా ప్రశాంతంగా వుంటుంది. మణికర్ణికనుంచి వచ్చే ధ్వని విషాదంగా ఆ ప్రశాంతాన్ని దుస్సహంచేస్తూ వుంటుంది. ఉండిఉండి సుమంతు డొకసారి పెద్దగా ఆవలిస్తాడు. అందరు ఒక్కసారి అతనివైపు తిరుగుతారు.)

సు : ఆకలి! ఆకలి!

భృ : బ్రహ్మసూత్రాలు వల్లించు. జైమిని గురువుల వ్యాఖ్యానం ఒక సారి మననం చెయ్యి.

దే : దానితో ఆకలి తీరుతుంది. పరమాన్నం తిన్నట్లే.

నం : వాల్మీకుల రామాయణం, వ్యాసుల వేదాంత సూత్రాలుంటే ఇంకా ఏం కావాలి!

సు : భగవాన్, కడుపు మండిపోతూవుంది. శరీరం శుష్కించి పోయింది. కన్నులు పీక్కుపోయినవి. ఇంకా ఎంతకాలం ఈ ఉపవాసం? ఏడురోజులనుంచి తిండిలేదు. ... ... ... ప్రేవులతో సహా తరుక్కుపోతున్నాయి. ఏమిచిక్కినా ఒక్క కబళంలో మింగి వేస్తాను.

దే : (ఇంతవరకూ సుమంతుని ఆనుకొని కూర్చున్నవాడు దూరంగా జరిగి) నన్నుమాత్రం మింగివేయకు.

సు : ఇంకా రెండురోజులదాకా భిక్ష దొరక్కపోతే నీవు చెప్పినంతా చేస్తా. అబ్బబ్బ! ఆకలి. నదిలో ఇంతకు ముందే గుంజుకొచ్చిన శరీరం చెమటతో నానిపోతున్నది. ఇక నేను కూర్చోలేను.

[శరీరం కృష్ణాజినంమీద వ్రాలుస్తాడు, అనతిదూరంలో మఱ్ఱి చెట్టు క్రిందకు జేరిన బ్రహ్మచారుల మధ్యనుంచి "అథాఽతో బ్రహ్మ జిజ్ఞాసా" అని పెద్దగా వినిపిస్తూవుంటుంది.]

సు : దేవలా! తలనొప్పి ప్రారంభించింది. వాళ్ళను కొంచెం మెల్లగా చదువుకో మనరాదూ?

దే : ఏయ్, ఎవరక్కడ! మెల్లగా చదువుకోండి.

[వినిపించుకోకుండానే పెద్దగా చదువుతుంటారు. సుమంతుని చెవులు గింగురుమంటాయి. చెవుల్లో వేళ్లు పెట్టుకొని భృగువువంక దీనంగా చూస్తాడు.]

భృ : (పెద్దగా) మీకే చెప్పేది, వినపట్టంలా?

[పెద్దగా వల్లిస్తున్న బ్రహ్మచారుల మధ్యనుంచి తలెత్తి వైశంపాయనుడు కాసేపు చూస్తాడు.]

వై : ఇది అధ్యయన సమయం. కాదనటానికి నీవెవ్వరివి?

దే : వట్టి జంతువు! (పెద్దగా) మీ అధ్యయనాన్ని ఎవ్వరు మానుకో మన్నారు? మెల్లగా చదువుకోమన్నాము.

వై : జాగ్రత్త! మా యిష్టం వచ్చినట్లు చదువుకొంటాం, మీకెందుకు?

భృ : కోపగించకు. సుమంతుడు అవస్థ పడుతున్నాడు. అందుకని మిమ్మల్ని మెల్లగా చదువుకోమన్నాము, అంతేనా?

వై : అంతేనా? మేము వినలేదనుకున్నారా ఏమిటి? నేను జంతువునా?

[దేవలుడున్నచోటికి వస్తారు. లోపలికి పీక్కుపోయి జేవురించిన కన్నులతో దేవలుడు వైశంపాయనుణ్ణి ఎగాదిగా చూస్తాడు. బ్రహ్మచారులంతా చుట్టూ మూగుతారు.]

భృ : ఊరక రౌద్రమూర్తివైతే ఎలాగోయి? చూడు, మన సుమంతుడు ఆకలితో చచ్చిపోయేట్టున్నాడు. ఆ బాధ చూడలేక ఏదో అని వుంటాడు. అంతమాత్రానికే......

సు : దాహం! దాహం!...గురుదేవా...గురుదేవా!

[దేవలుడు ఆతురతతో నీళ్ళకోసం ప్రక్కన వెదుకుతాడు. వైశంపాయనుడు ఇంతకుముందు కూర్చున్నచోటికి పరుగెత్తికెళ్లి కమండలం తెచ్చి సుమంతునికి అందిస్తాడు. అతడు వణకుతున్న చేతుల్తో అందుకొని పుక్కిలించి గుక్కెడు నీళ్లు త్రాగబోతాడు. గొంతులోనుంచి నీళ్లు జారక కళ్లు తేలవేస్తాడు. అంతా తత్తరపాటుతో సుమంతునిచుట్టూ మూగుతారు. వైశంపాయనుడు వాళ్ళనందర్నీ దూరంగావుంచి సుమంతుని తల ఒళ్లో పెట్టుకొని గుండె సవరిస్తాడు. అలా సవరించగా సవరించగా మింగుడుపడని నీళ్ళు లోపలికి జారుతాయి. 'అమ్మా' అని నిట్టూర్చి సుమంతుడు కన్నులు మూస్తాడు. మిగిలిన వాళ్ళంతా ఒకరిముఖం ఒకరు చూచుకుంటూ వుంటారు. ఇదంతా చూస్తున్న దేవలుని హృదయం మండుతుంది.]

దే : అథాఽతో బ్రహ్మజిజ్ఞాసా! అథాఽతో బ్రహ్మజిజ్ఞాసా! బాధ పడుతున్నా బ్రహ్మజిజ్ఞాసే, ఒక ప్రక్క చస్తున్నా బ్రహ్మజిజ్ఞాసే! ఆనాడే గురువులతో వాదించాను. మానవునికి తిండి అవసరం. ఆర్థికసౌమ్యస్థితి ఏర్పడాలి. మానవుని చరిత్ర ఆర్థికనేమిపై దొర్లుతూవుంటుంది.

నం : పిచ్చివాడా! జగత్తే మిథ్య. మానవులు బుద్బుదప్రాయులు.

దే : మానవులు బుద్బుదప్రాయులైనా, మానవుడు నిత్యుడు; అమర్త్యుడు.

నం : (వినిపించుకోకుండానే) మొగ్గలు పుష్పించి రాలిపోతాయి. మేఘాలు గుమిగూడి వర్షించి విచ్ఛిన్నమౌతాయి. నాలుగు రోజులు పచ్చికబయళ్లలో తిరిగి నశిస్తుంటాయి. లోకాన్ని పండు వెన్నలతో నింపి పూర్ణిమాతారకరాజు కుహూశార్వరిలో అదృశ్యుడౌతాడు. మానవుడూ అంతే. రెండు రోజులు ఈ ప్రపంచమనే నాటకశాలలో నటించిపోతాడు. శాశ్వతమేమీ లేదు. బ్రహ్మ యొక్కటే నిత్యము, నిర్గుణము, నిర్వికారం.

దే : అంతావట్టి అబద్ధం.

శృ : వైశంపాయనులు, బ్రహ్మచారులు. నీవు నాస్తికుడిలాగ కని పిస్తున్నావు, జాగ్రత! గురుదేవులతో చెపుతాం.

దే : నందీశ్వరుడు ఇంతసేపు చెప్పినా, ఒక్కటే చెప్పింది. అదీ సహేతుకంగా లేదు.

శృ : సహేతుకంగా లేదా!

వై : గురుదేవునిలాగా చెప్పాడు.

దే : మూర్ఖులకు వాగిందే పదితడవలు వాగితే సహేతుకమై పోతుంది. వేరేప్రమాణా లక్కరలేదు.

అంతా : (చురచురచూస్తూ) మేమంతా మూర్ఖులం!

దే : మీకు కోపం రావడంలో ఆశ్చర్య మేముంది? ప్రపంచం ఒక్క ప్రతిభను మాత్రం ఎప్పుడూ సహించలేదు.

నం : అతనితో ప్రత్యేకంగా వాదించడం దేనికి? నేను పదిరోజులక్రితం బ్రహ్మపదార్థాన్ని విశదీకరిస్తూ భిక్షాపాత్రమీద సహస్రనామాలు వ్రాశాను, వినిపిస్తాను.

దే : తప్పకుండా వినాలసిందే. గురుకులమంతా ఆకలిచిచ్చులో మల మల మాడిపోతూవుంది! నకనకలాడే పొట్టలతో అవశ్యం వినండి. ఆకలి తీరుతుంది. జన్మ తరిస్తుంది.

నం : ఈ శరీరం నిత్యం కాదు. ఈ శరీరానికి కలిగేకష్టసుఖాలు అంత కంటే నిత్యం కావు. పరబ్రహ్మ మొక్కటే నిత్యం. కాబట్టి పర మార్థచింతనమే మానవుడికి కర్తవ్యం.

సు : (నాలుక చప్పరిస్తూ) దాహం! ధాహం!

దే : ఓయీ, పిచ్చివాడా! విను, విను. మన నందీశ్వరుడు పరమ పదామృతాన్ని కటాక్షిస్తున్నాడు. ఒక పుడిసెడు పుచ్చుకో, లేచి కూర్చుంటావు!

భృ : ఒకప్రక్క ప్రాణాలు పోతూవుంటే ఈ వెక్కిరింపులేమిటి?

దే : మరి ఈ వేదాంత బోధనలో?

నం : నీవు అథఃపతితుడ వౌతావు. ఎంత పూర్వపుణ్యమో వుంటేగాని ఆర్షసూక్తాలు అర్థం కావు; అమరత్వం ప్రాప్తించదు.

దే : స్వల్పమైన ఈ నూరేండ్ల జీవితంతోనే వేగలేకుండా ఉన్నాను. అలాంటప్పుడు ఈ అమరత్వం దేనికి ?

వై : ఎవరి గొడవ వారిదిగావుంది. సుమంతుడు మళ్లా కన్నులు తేల వేస్తూ ఉన్నాడు. భృగూ! త్వరగా పోయి ఈకమండలువుతో జలం తీసుకురా.

[భృగువు కమండలంతో వ్యాసుని కుటీరానికి పరుగెత్తు కెళ్లు తాడు. దేవలుడు నందీశ్వరుడు తప్ప తక్కినవారంతా దిగులుపడి సుమంతునిచుట్టూ కూర్చుంటారు. వైశంపాయనుడు ఉత్తరీయంతో సుమంతునికి విసురుతూ వుంటాడు.]

నం : (దేవలునిమీద కోపంతో భిక్షాపాత్ర తత్త్వాన్నితోడి విద్యా ర్థులకు ఉపన్యసించాలని గొంతు సవరించుకొని) దేవలుడు నానా టికి అథోగతి పాలవుతున్నాడు.

దే : కాదు, క్షణక్షణానికి.

నం : సరిగా చెప్పావు. క్షణక్షణానికి అధోలోకానికి దారితీస్తున్నాడు. నాస్తికత్వం అతన్ని ఆవేశించింది. నీచాతి నీచమైన భౌతిక తత్త్వాన్ని బోధిస్తున్నాడు. ఐహికాలైన భోగాలు, ధనధాన్యాలు శాశ్వతంకావు. మానవునకు పరమావధులు కావు. అవే పొంద వలసినవైతే, జంతువులకూ, మానవులకూ భేదంలేదు. నిరుపాధిక సత్త్వార్థమైన ఆనందం, సచ్చిత్స్వరూపమైన ఆనందం ఒక్కటే వివే చనాబుద్ధి గలిగిన మనుజునికి ఆదర్శం. ఆ ఆనందమే బ్రహ్మం.

దే : బలే, చక్కని ఉపన్యాసం! గురుదేవులనుండి కూడా ఇలాంటి వాఘ్ఝరి ప్రవహించలేదు.

నం : (వినిపించుకోకుండా మళ్ళీ) పక్వమనస్కులు ఆ బ్రహ్మంకోసం అన్వేషిస్తారు. ఈ భోగాలు వారికి ఒక లెక్కలోనివికావు. ఇందుకు పూజ్యపాదులే తార్కాణం. (ఆవేశంతో) సామ్రాజ్యాలు వారిచేతుల మీదుగా నడిచాయి. కురుపాండవుల మధ్య నిష్కాములై ప్రవర్తించారు. సింహాసన మధిష్ఠించిన ఆ లలితారుణ పాదములు ఈనాడు భిక్షకోసం బ్రాహ్మణవాటిలో వీథివీథిలో సంచరిస్తున్నాయి. ఏవి బంగారు గంటంతో భారత సంహితాకృతిని కవితాకన్యచేత లలితనృత్యం చేయించాయో, ఏవి లోక సంగ్రహార్థం పదునెనిమిది పురాణాలు ఏకథాటిని రచించాయో, ఆ అంగుళీ సనాథములైన పల్లవాంగుళులు భిక్షాపాత్ర కీలించాయి. వేదవిభాగంచేసి, మనోజ్ఞంగా వల్లించే ఆ మృదు కంఠం "భిక్షాం దేహి, భిక్షాం దేహి," అని ముక్త కంఠంతో నీలమేఘ పథాలలో మొరసే గర్జనలాగ కాశీ వీథుల్లో మారుమ్రోగు తుంటుంది. అలాంటి మహర్షులే నారాయణ స్వరూపమైన దారిద్ర్యాన్ని స్వీకరించి సంయములై ఉన్నారు. అలాంటివారే మొదలకుండా వుంటే మీకెందుకు ఈ తహతహ?

సు : నీళ్లు!.........నీళ్లు!..........

బ్రహ్మచారులంతా : భృగువు నీరు తేబోయాడు. త్వరలోనే వస్తాడు.

ఉదబిందువులు

సు : అబ్బా!..........

దే : మన నందీశ్వర ముష్టింపచులవారి ఉపన్యాస మైనా ముగియలేదు. అప్పుడే ఎలావస్తాడు?

వై : ఈపాటికి వస్తూవుండాలి. చాలసేపైంది.

సు : ప్రాణాలుకడబట్టుతున్నాయి.....ఇలా దాహజ్వాలల్లో మాడి చావవలసిందేనా?

దే : ఎందుకు చావాలి? మన నందీశ్వరుడు ఉన్నాడు. (అతనివైపుకు తిరిగి) ఏదీ, మీ ఉపన్యాసామృతాన్ని ఒక్కసారి యీ సుమంతునిమీద ప్రోక్షించి బ్రతికించుదురూ, పుణ్యముంటుంది.

వై : ఇప్పటికే సగం చచ్చిపోయాము. ఇక మమ్మల్ని బ్రతుక నివ్వవా ఏమిటి?

దే : అలాకాదు. నిరుపాధికసత్తార్థమైన ఆనందం యొక్క స్వరూపాన్ని తెలుసుకోవాలి. అదే మానవజన్మ ఎత్తినందుకు ఫలం.

మొ: బ్ర : నందీశ్వరుడు గురుకులం విడిచివెళ్ళి కుడిచి వచ్చినట్లున్నాడు. లేకపోతే యీ చర్చకు దిగడు.

దే : అతడు సాక్షాత్తు నందీశ్వరుడు. ఆకలిదప్పులు అతనికి ఉండవు.

రెం : బ్ర : అంటే హిమాలయాల్లో మేసివచ్చాడనేగా?

దే : అలాగని నేను చెప్పానా? ఆ పాపం నాకెందుకంట గడతారు?

నం : వట్టి పశువు! పొరపాటున......

దే : సంయములు ఇలా అంతశ్శత్రువులకు వశంకావడమేనా?

వై : దేవలా! శ్రుతిమించి పోతూ వుంది. ఇంత నీచంగా మన మెప్పుడైనా ప్రవర్తించామా? "బుభుక్షితః కిన్న కరోతి, పాపం?" అదిగో పూజ్యపాదులు వస్తున్నారు.

మొ : బ్ర : శరీరం బడలి ఉంది.

రెం : బ్ర : కన్నులు నెత్తురుజొత్తుల్లాగా ఉన్నాయి.

దే : బ్రహ్మవర్చస మొలికేముఖం వాడి మలిన మేఘావృతమైన చంద్ర బింబంలాగ వుంది.

వై : వ్యాకుల హృదయులుగా కనిపిస్తున్నారు.

మొ: బ్ర : పూజ్యపాదులతో ఇంకా ఎవరో వస్తున్నట్లున్నది.

రెం : బ్ర : ఎక్కడో చూచాము.

మొ: బ్ర : వారి సంగతి ఎలా వున్నా, వారి నడకలోని ఊపు ఎక్కడో చూచాము.

దే : జైమినులు.

వై : ముఖంలో మార్పు కలిగింది.

మొ: బ్ర : నుదుట ముడుతలేర్పడ్డాయి.

రెం : బ్ర : కఠినోపవాసాలు! అలాంటి దృఢశరీరులు కూడ చలించి పోయారు.

దే : ఇస్ ! పూజ్యపాదుల కన్నులనుండి రెండశ్రువులు రాలాయి.

వై : ఎప్పుడూ వారి కన్నులు చెమ్మగిల్లలేదు.

దే : దుర్భరం, ఆ విశాల నేత్రాంచలాలనుంచి వెడలే ఆ చూపులు శల్యతుల్యాలై నా హృదయకుహరాన్ని చీల్చి వేస్తున్నాయి. ఆ పవిత్రాధరాలు చలిస్తున్నాయి... ఏదో మాట్లాడుతున్నారు.

వై : ముఖంమీది ముడతలు విషాదభరంతో ఎక్కువయ్యాయి.

దే : ఇస్, విను విను.

[వ్యాసుడు జైమినితో మాట్లాడుతూ వస్తుంటాడు. మంచి ఒడ్డు పొడవులున్న మనిషి. వయస్సు మళ్లినా యోగాభ్యాసంవల్ల శరీరం బలిష్ఠంగావుంది. ఏడు రోజులనుంచి తిండి లేకపోవడంవల్ల ముఖం వసి

వాడి పోయివుంది. అయినా బ్రహ్మతేజమింకా మ్లానం కాలేదు. జడలు దట్టంగా పొడుగ్గా వేలాడుతూవుంటాయి. గడ్డం జొంపంగా ఉన్నా అంత పొడుగ్గా లేక ముఖం గంభీరంగా, అందంగా కనిపిస్తుంది. చెవుల్లో రుద్రాక్షకుండలాలు, మెడలో రుద్రాక్షమాల ఉన్నాయి. కాళ్ళకు పాదుకలు, బిళ్ళగోచి దోవతి. (ఆ రోజుల్లో కౌపీనంతో కాశీ వీథుల్లో భిక్షాటనం చేసినా, యీ నాటి నాటకరంగం మీాద అలా కని పించటానికి వీల్లేదు.) చెక్కిళ్లు విశాలంగా ఉంటాయి. ముక్కు కోటేరు లాగా వుంటుంది. కన్నులు ఎదుటివారి హృదయం చీల్చి చదివేటట్టుగా వుంటాయి. ముఖవికాసం సమగ్రమైన ప్రపంచానుభవాన్ని, బ్రహ్మ జ్ఞాన సంపత్తినీ వెల్లడిస్తూ వుంటుంది. చూడగానే అతడు మహాకవి అని కూడ తెలుస్తుంది.

జైమిని వ్యాసుని అంత పొడగరి కాడు. కాని అతనికంటె లేత వాడు. వ్యాసుని దగ్గరే చదువుకున్నాడు. అచ్చంగ గురువులాగ తరిఫీ దయ్యాడు. గురుకులమంతా ఇతని ఆజ్ఞానుసారంగా నడుస్తుంది. వేదా ధ్యయనం, వేదాంత బ్రహ్మసూత్రార్థ బోధనలు ఇతడే నడుపు తుంటాడు. అంటే వ్యాసుడు గురుకులానికి ప్రిన్సిపాల్ ఐతే, జైమిని వైస్ ప్రిన్సిపాల్. వ్యాసుడు ఎప్పుడూ వ్రాస్తూనో, ఆలోచిస్తూనో ఉంటాడు. అందువల్ల క్లిష్టమైన విశేషాలు తెలుపవలసి వచ్చినప్పుడు మాత్రమే అతని ఉపన్యాసాలుంటాయి.

భృగువు వారివెనుక గురువుల కమండలువు, భిక్షాపాత్ర పట్టు కొని వస్తూ వుంటాడు.]

వ్యా : జైమినీ !

జై : (నిద్రలోనుంచి మేలుకొన్నట్టుగా) ఏమి గురూ !

వ్యా : పురాణాలకు ప్రతులు వ్రాసుకొంటున్నారా!

జై : వ్రాసుకోవడమైంది. ఇంటింటా చదువుతున్నారు.

వ్యా : భారతమో ?

జై : పురాణాలకంటె భారతంప్రతులు కోకొల్లలుగా లోకంలో వ్యాపించాయి. ఎందుకు అలా అడుగుతున్నారు?

వ్యా : వేదాంత సూత్రాలుకూడ చేయిదాటి పోయిన వన్న మాట.

జై : మీ హృదయం అర్థం కావటం లేదు.

వ్యా : (నిట్టూర్చి తనకు తానుగా) ఉన్న అవకాశంకూడ పోయింది.

జై : ఏ అవకాశం పోయింది? నేడేదో మీలో మార్పు కనిపిస్తూ వుంది.

వ్యా : నా పుస్తకాలు లోకం చేతిలో పడకుండా వుంటే ఎంత బాగుండేది?

జై : (వ్యాకులంగా) ఎందుకిలా మాట్లాడుతున్నారు? మీ కావ్యాలు మహత్తర మైనవి. లోకం మీ కావ్యాల్ని సృష్టించలేదు. మీ కావ్యాలు లోకాన్ని సృష్టించాయి. భావికవులకు వలసినంత వస్తువును అందిస్తవి. మీరు సృష్టించి నన్ని ఘట్టాలు, చిత్రించినన్ని పాత్రలు మరే కవీ చేయలేడు. మీ సృష్టి బాహుళ్యానికి భవిష్యత్తులో పండితులు అసూయాపరవశులై మీకు బహుత్వ మాపాదిస్తారు. ఇది నిజం. మీ ప్రతిభ అనన్యం. ఇలాంటి పుస్తకాలు లోకంలో ప్రచారం కావాలి. మీరు ఆ ప్రచార నిషేధం ఎందుకు కోరుతున్నారో అర్థం కావటం లేదు.

వ్యా : ఇప్పుడు కూడ నా పుస్తకాలు అలాగే కనిపిస్తున్నాయా!

జై : ఇప్పుడే కాదు, ఎప్పటికీ నిత్యనూతనాలు. శబ్దబ్రహ్మ స్వరూపం తెలిసినవా డెవ్వడూ మీ కృతుల్ని కాదనలేడు. మీ ప్రతిభకు చెలియలికట్ట లేదు. మీ కవిత్వానికి జరామయములు లేవు. గురూ, గురూ! మీ వాక్యాలు చదువుతూ వుంటే నేనీ ప్రపంచాన్నే మరచిపోతాను. నా హృదయంలో ఏవో భావాలు పరుగెడుతుంటాయి. ఒక బ్రహ్మాండమైన విజ్ఞాన తేజస్సు నన్నావరిస్తుంది. నన్ను నేనే మరచిపోతాను.

వ్యా: (విషాదంగానవ్వుతూ) ఈ ఉపవాసంలో కూడ నీకలాగే కనిపిస్తున్నవా?

జై ; ఆ గ్రంథాలు దగ్గరుండబట్టే నాకు కష్ట మనిపించటంలేదు.

వ్యా: నా వంక చూడు. జీరలో జీర మలగివున్న నీ కన్నులు నిర్మలాకాశపు నీలినీడలు ప్రసరిస్తున్నాయి. అవ్యక్తబాధను సూచిస్తున్నాయి.

జై : లేదు, నాకేబాధ లేదు.

వ్యా: నీకు తెలీదు. నీవు బాధపడుతున్నావు.

జై : విచిత్రంగా మాట్లాడుతున్నారు. ఇంతవరకు పూజ్యపాదులు ఇలా మాట్లాడగా వినలేదు. క్రొత్తగా కనిపిస్తున్నారు.

వ్యా: (నెమ్మదిగా) నీకే కాదు, నాకు నేనే క్రొత్తగా ఉన్నట్లున్నది. (విషాదంగా), జైమినీ! జైమినీ! నా పుస్తకాలు లోకంలో లేకుండా చేయటానికి వీల్లేదా?

జై : మీ కృతులను గూర్చి ఇంతగా ఆరాటపడుతున్నారు దేనికి? ఇంత వ్యాకులపడవలసిన అవసరం కనిపించటంలేదు.

వ్యా: వత్సా! అలాకాదు. నా పూర్వతత్త్వమంతా నాటుకుపోయి నీ హృదయం కర్కశమై పోయింది. నీ యువహృదయం అంతకు మించిపోదు. ఇంకా నీ కనుభవం కావాలి. నా కావ్యవిపంచీ నాదంతో తన్మయుడవై పోయావు. తన్మయుడవై పోయినంత కాలం నీకు లోటు కనిపించదు.

జై : సర్వతోముఖాలైన మీకావ్యాల్లో లోటులా! అసంభవం. నేను ఒప్పుకోలేను. మీరు రసజ్ఞులనీ, గంభీర హృదయులనీ, సూక్ష్మ బుద్ధులనీ, గురుకులం, వారణాసి, భరతవర్షం చెప్పుకుంటున్నాయి.

వ్యా: గురుకులం కాదు. భరతవర్షం కాదు. నీలోని యువ హృదయం చెబుతూవుంది. నీవు ప్రతిభాశాలివని చెప్పుకోటానికి నన్ను గొప్ప

వాణ్ణి చేస్తున్నావు. నా పుస్తకాలు మహత్తరమైనవని అంటు న్నావు.

జై : (ముఖం ఎర్రబడుతుంది) మీ పుస్తకాలు చాల గొప్పవి. కూలంకషంగా మానవుణ్ణి చిత్రించాయి. మీరేమన్నా సరే, ఏ లోటు పాటులూ వాటిలో లేవు.

వ్యా: పిచ్చివాడా! నా వీణానాదంలో శ్రుతి తంతువునే లగించలేదు.

జై : ఆఁ! (విస్తుపోయి, రెండు నిమిషాలు మొగాన నెత్తురు చుక్క లేకుండా చూచి) శ్రుతి తంతువు లగించలేదు! శ్రుతి తంతువునే లగించలేదు.

వ్యా: నేటికి తెలిసి వచ్చింది.

జై : పూజ్యపాదుల హృదయం బ్రహ్మపదార్థంలాగా కనిపిస్తోంది.

వ్యా: భృగూ! (ఆలోచిస్తున్న వ్యాసుడు ఒక్కసారి కఠినంగా పిలుస్తాడు. పిలుపుతో హడలిపోయి భృగువు వణకిపోతూ వుంటాడు.) ఏదీ నాభిక్షాపాత్ర! (భృగువు వణకుతున్న చేత్తో భిక్షాపాత్ర అందియ్యబోతాడు. జారి క్రిందబడి వ్రక్కలయ్యేదే. జైమిని పట్టుకుంటాడు.)

జై : (కోపంతో) ఓరి అప్రాచ్యుడా!

[ఈ మందలింపుతో తత్తరపాటుకు్కవై కమండలువు కిందబడి బ్రద్దలౌతుంది. వ్యాసుని ముఖంలో విషాదరేఖ కనిపిస్తుంది.]

జై : అపశకునం! అపశకునం! ఇకమీదట గంగాతీర్థం లభించదు కాబోలు! మహాదేవ్! మేమేమిపాపం చేశాము? తిండిలేక పోయినా, ఈ పవిత్ర భాగీరథీజలంతో పొట్టలు నింపుకొంటు న్నాము. దీనికికూడా నోచుకోలేదా?

వ్యా: ఎందుకు దూపటిల్లుతావు? కాశీనివాసానికే నోచుకోలేదు.

జై : ఆఁ! ఆఁ! ఏమి సెలవిచ్చారు! శివశివా! గురువుల ముఖంనుండి వచ్చిన వాక్కు వ్యర్థంకాదు.

వ్యా: వ్యర్థంకాదు! అలా నిర్దిష్టమై కనిపిస్తూనేవుంది. (ఒక్క అశ్రుకణం చేతిలోవున్న భిక్షాపాత్రలో పడుతుంది. వ్యాసుని ముఖంమీద ముడతలెక్కువౌతాయి. జైమిని ఖిన్నుడై ఆతురతతో గురువు ముఖంలోకి చూస్తాడు.) ఈ జారిన అశ్రుకణమే ఇదివరకే యీ భిక్షాపాత్రలో వర్షించి ఉన్నట్లయితే! ........ జారలేదు. అందుకనే శ్రుతిలేనిరాగ మాలపించాను. ఈ మూర్ఖలోకం పరవశమై తలవూపింది.

జై : (అర్థంకాక) శ్రుతిగలిపి ఇప్పుడు నూతనరాగం ఎందుకు ఆలపించరాదు?

వ్యా: వెనుకటి కంఠమాధుర్యం నశించింది. అయినా యీ దేశంలో పాడే అవకాశం పోయింది. అనాగరికులమధ్య పాడినా ఫలంలేదు.

జై : క్షణక్షణం మీ హృదయానికి దూరమౌతున్నట్లున్నాను. ఇతనితో మీ హృదయం చెప్పగూడదా?

వ్యా: (అర్థంలేని చూపులతో చూస్తూ భిక్షాపాత్రతో) నా జీవిత ప్రభాతకాలంలో నీలో అశ్రుకణం రాలలేదు. చివరికి పిడుగన్నా పడలేదు. పడినట్లయితే, ఎంతవికాసం కలిగేది! ఎంతచైతన్యం కలిగేది! నాకు సచ్చిదానందమైన దృష్టి యేర్పడేది. ఆ గంభీర హృదయుడైన కృష్ణుణ్ణి, అక్కడుపాండవుల్ని, తక్కినరాజుల్ని, మానవుల్ని అర్థంచేసుకొని ఉండేవాణ్ణి. దేవతాకోటిసహితం నమోవాకం చేసిఉండేది. లేదు, ఆ పుణ్యానికి నోచుకోలేదు. ఆ ఉదారదృష్టి లేక పోవడంవల్లనే యీ గురుకులాన్ని, ఈ నిర్భాగ్య మానవలోకాన్ని కష్టాలుపాలు చేశాను. ఈ మానవులకు చాతుర్వర్ణ్యం విధించాను. బీదలకు ద్రోహంచేసే కర్మ సిద్ధాంతమూ, అవతారవాదము బోధించి దాస్యం అంగీకరింపజేశాను. నా గీత ఈ కర్మభూమిలో ఎంతకాలముంటుందో అంతవరకు

నివృత్తి లేకుండా చేశాను. ఈ సంఘమే మారిపోకుండా ఆశాసిం చాను. ఈ భిక్షాపాత్రతో ఆ కష్టజీవుల్ని జీవించమన్నాను. మహాపరాధం చేశాను. మానవునిలో ఇంత అధికారపిపాస, ఇంత అహంకారం ఉంటుందని అనుకోలేదు. ఈ అహంకార భూయిష్ఠ మైన హృదయాన్ని నమ్మి, హృదయ పరివర్తనంకోసం పాటుపడ మన్నాను. ఆధ్యాత్మికమనే పేరుతో తుచ్ఛ భౌతిక తత్వాన్ని ఉపదేశించాను. ఆదర్శ ప్రాయంగా అలాగే భిక్షాపాత్ర నిచ్చి విద్యార్థుల్ని పాడుచేశాను. జైమినీ! జైమినీ! ఆ బ్రహ్మ చారులవంక చూడు: ఆ పాలుగారే చెక్కిళ్లు ఎలాపాలిపోయాయో విద్యాబుభుత్సువులైన ఆనేత్రాలు ఎలా దీనంగా ఉన్నాయో! దుర్భరం! నేను వారి ముఖం ఎలాచూచేది! తల్లిదండ్రులను వదలి నన్ను నమ్ముకొని ఆశ్రయించారు. విద్యాభిక్ష కోరారు. నిత్యసుశ్రూష నెరపుతూ వున్నారు. ప్రతిఫలంగా ఏమి ఇస్తు న్నాను........ఏడు రోజులనుంచి తిండి తిప్పలు లేకుండా నస్తుంచాను.! ఇకమీద కూడ వారికేమి ఉపదేశం చెయ్య బోతున్నాను? ఈ భిక్షాపాత్ర ధరించి ఆకటిచిచ్చుతో దిగంతాల దాక తిరగండని ఉపదేశమియ్యబోతున్నాను. అబ్బా, విప్లవ హృదయాన్నే చిదిమివేస్తున్నాను. (కంఠం రుద్ధమౌతుంది. జైమిని విషాదంతో మాట్లాడలేక పోతాడు. ముగ్గురూ మెల్లగా బ్రహ్మ చారులవైపు నడుస్తూ వుంటారు. దేవలుడు, వైశంపాయనుడు సుమంతునికి ఉపచారాలు చేస్తూ వుంటారు.)

మొ. బ్ర: ఎండ ప్రచండంగా కాస్తూవుంది.

రెం. బ్ర: సుడిగాలి లేసింది. గురుకులంలోని తీగలు, కొమ్మలూ ఎగిరి పోతూ వున్నాయి.

మొ. బ్ర: ఎన్నడూ యింత భయంకరంగా గాలి వీచలేదు. ఇంత కణకణ లాడే నిప్పులు సూర్యుడు ఇంతకుమున్ను వర్షించలేదు.

రెం. బ్ర: ప్రకృతే ఉత్పాతకరంగా వుంది.

నం: పూజ్యపాదుల చేతులోని భిక్షాపాత్ర కంపిస్తున్నట్లున్నది.

రెం. బ్ర: ఏదో జరుగుతుంది ?

దే : (అందుకొని) ఈ గురుకులవాసుల సంగతి ఎలా వున్నా పూజ్యమైన భిక్షాపాత్ర కేదో విపత్తు వాటిల్లుతుంది.

(ఇంతలో వ్యాస జైమినులు, భృగువు వస్తారు. సుమంతుడుతప్ప అంతా నిల్చుని నమస్కారం చేస్తారు. వ్యాసుడు విషాదంతో గంభీరంగా వుంటాడు.)

జై : సుమంతు డెలాగున్నాడు?

దే : (కోపం కనపడకుండా) ఇంకాచావలేదు. (భయంతో ఒకరి ముఖం ఒకరు చూచుకొంటారు.)

జై : అవజ్ఞ ! గురుద్రోహం !

[సుమంతుడు పెద్దగా మూలుగుతాడు.]

దే : ఒకప్రక్క ప్రాణాలు పోతున్నాయి. అవజ్ఞట, అవజ్ఞ !

(వ్యాసుడు ముఖం త్రిప్పుకొంటాడు.)

వై : నేడైనా ఒక కబళం దొరికితే........

నం : ఇక్కడ కూర్చుంటే ఎలా దొరుకుతుంది ? కర్మచెయ్యాలి లేకపోతే ధర్మహాని.

దే : ప్రాణం కాదు పోయేది, ధర్మం.

జై : (వ్యాసుని ముఖంలోకి చూస్తూ) గురూ, త్వరగా భిక్షకు వెళ్ళి వస్తాము. మీరు ఆశ్రమంలో ఉండండి

వ్యా: (తీక్షణంగా జైమినివంక చూస్తూ) రండి !

[ముందు నడుస్తాడు. అక్కడున్న బ్రహ్మచారులంతా వెంట నడుస్తారు. జైమిని కఠవల్లి మంత్రచరణం ఎత్తుకొంటాడు. వ్యాసుడు తప్ప తక్కినవారంతా గొంతులు కలిపి పాడుతూ బయలు దేరుతారు.]

## ౨

[బ్రాహ్మణవాటికలోని బజారు. తిన్నగా పోదుగ్గా వుంటుంది. బజారు సగంలోకి పోయింతరువాత హట్టం ప్రక్కనే పెద్దమేడ. ఇందాకటివారంతా వల్లిస్తూ బయలు దేరుతారు.]

బ్రహ్మచారులంతా :

య ఏష సుప్తేషు జాగర్తి
కామం కామం పురుషో నిర్మిమాణః,
తదేకం శుక్రం తద్బ్రహ్మ
తదేమ్వత ముచ్యతే.
తస్మిన్ ల్లోకా శ్రితా స్సర్వే
తదునా త్యేతి కశ్చన.

జై : ఏత ద్వైతత్.

బ్ర. అందరూ : అగ్నిర్యథైకో భువనం ప్రవిష్టో
రూపం రూపం ప్రతిరూపో బభూవ,

జై : ఏక స్తథా సర్వభూతాంతరాత్మా
రూపం రూపం ప్రతిరూపో బహిశ్చ.

దే : భిక్షాం దేహి.

గేస్తురాలు : (సమాధానం రాదు.)

[అంతా నడుస్తూ వుంటారు]

బ్రహ్మచారులు : వాయు ర్యథైకోభువనం ప్రవిష్టో
రూపం రూపం ప్రతిరూపో బభూవ,

జై : ఏకస్తథా సర్వభూతాంతరాత్మా
రూపం రూపం ప్రతి రూపో బహిశ్చ.

దే : (ఇంకో ఇంటిముందు ఆగి) భిక్షాం దేహి!

గేస్తురాలు 2 : ఇంకా వంట కాలేదు.

వై : నిన్నటిగతే ప్రాప్తించేటట్లుంది.

నం : పూజ్యపాదుల ముఖంలో దుర్నిరీక్ష్య తేజం కనిపిస్తోంది.

మొ. బ్ర: కన్నులు కుసుంభ కుసుమాలుగా ఉన్నాయి.

బ్ర. అం : సూర్యో యథా సర్వలోకస్య చక్షు
ర్నలిప్యతే చాక్షుషైర్బాహ్యదోషైః,

జై : ఏకస్తథా సర్వభూతాంతరాత్మా
నలిప్యతే లోక దుఃఖేన బాహ్యః.

దే : భిక్షాం దేహి!

వై : భిక్షాం దేహి!

గేస్తురాలు 3 : మళ్ళీ రండి.

రెం. బ్ర : ప్రొద్దు ఎదురయ్యేట్లే వుంది.

నం : గురుదేవుల భ్రుకుటి ముడివడుచున్నది.

భృ : కన్నులనుండి విస్ఫులింగాలు వెలువడుతున్నాయి.

మొ. బ్ర : జైమినుల ముఖం జేగురువారింది.

భృ : వెనుక బడుతున్నాము నడవండి.

దే : (ఇంకో మేడగుమ్మంలో నిలిచి) భిక్షాం దేహి!

వై : భిక్షాం దేహి!

జై : పూజ్యపాదాయ వేదవ్యాసాయ భిక్షాం దేహి!

గేస్తురాలు 4 : భిక్ష కూడదు.

భృ : భగవాన్, నేడుకూడా ఉపవాసమే.

మొ. బ్ర : పూజ్యపాదులు అందరికంటె ముందు వెళ్లారు.

రెం. బ్ర : ఆపాదమస్తకం కంపించిపోతున్నారు.

నం : ప్రళయార్క తేజం పుంజీభవించినట్లున్నారు. ఆ రౌద్రాకృతి చూస్తూవుంటే నాకాళ్లు వణకిపోతున్నాయి.

భృ : జైమినులు వెన్నంటి పోవాలని నడుస్తున్నారు. కాని కలుసుకో లేకుండా ఉన్నారు.

వై : కాలాంత మేఘము ఉరిమినట్లున్నది. ఫాలనేత్రుడు హుంకరించి నట్లున్నది. అదిగో.

వ్యా: భిక్షాం దేహి !

గేస్తురాలు 5 : లేదు.

దే : లేదు—వేదవిభాగం చేసిన మేధావికి భిక్ష లేదు. మానవాదర్శం నిరూపించి చెప్పిన తత్త్వవేత్తకు భిక్ష కూడదు. అష్టాదశపురాణ నిర్మాతకు భిక్షకూడదు. బ్రహ్మసూత్రాలు వ్రాసిన మనీషికి భిక్ష లేదు. దారుణం, దారుణం! విద్యాగరీయసిమైన యీ పురిలోనే ప్రతిభకు తావు లేకపోతే ప్రపంచంలో ఇంకెక్కడుంది.? దుర్భరం. ఈ పురబ్రాహ్మణ్యం దేనికి? ఈ విశ్వనాథుడు దేనికి, కాల్చనా? ఒక్కొక్క నెత్తురుబొట్టుతో ఒక్కొక శ్లోకం వ్రాసి అన్ని మహాకావ్యాలు లోకాని కందించిన మహాకవికి తిండి లేదు. ఏడు రోజులనుంచి తిండిలేదు. మంజుల శ్లోకాల నాలపించే ఆ మహో దాత్తముఖం ఆకలి దప్పులతో వాడిపోవలసిందే నన్నమాట ! ఆ వేదఘోషాసనాథమైన ఆ గంభీరకంఠం ప్రావృణ్మేఘ దుందుభి విచ్ఛిన్నం కావాలన్నమాట ! లోకంలో కళ, కవిత్వం, మనీష, సౌందర్యం. సౌకుమార్యం నిలువున ఎండి పోవలసిందేనన్నమాట! వాటికి తావేలేదు. ఇంతవరకు భ్రాంతిపడ్డాను.

దే : అహో! అహో! భయానకం! భయానకం! వజ్రాహతి చిద్రు పమై ధ్వనించే మహోన్నత పర్వతంలాగా వుంది. అజాండభాండములు డీకొని వ్రక్కలైనట్లున్నాయి, భిక్షాపాత్రిక బ్రద్దలైంది. అధరితమై చలించే కర్కోటకుని ఫణాఫలకంలాగా ఆ శాపాంజలి భయంకరంగా వుంది. ఆ కోపానికి విచ్ఛిన్నమైన పాత్రికాలవములు కూడ చలించి పోతున్నాయి.

నం : ఆవేశంతో పూజ్యపాదులకు శాపజల మందుకోటానికి కేలు సాగటంలేదు.

జై : జైమిని ఎందుకడ్డు తగులుతాడు? మూర్ఖుడు. ఇలాంటి నీచలోకమే అతనికి కావాలి. పూజ్యపాదులు ఇలాంటి లోకాన్ని సహించలేరు.

శ్రీ : ఓ, పుష్కలావర్తకాదులు అటుతినికి ఇటుతినికి గర్జించినట్లుగా వుంది. కఠోరం!

వ్యా: మాభూత్త్రిపూరుషీ విద్యా!
మాభూత్త్రిపూరుషం ధనమ్!
మాభూత్త్రిపూరుషీ భక్తిః!
(ఆ ఉద్వేగంవల్ల కంఠంలో ఏదో అడ్డుతగులుతుంది.)

జై : గురుదేవా! గురుదేవా!

వ్యా: (కంఠం సవరించుకోవటానికి హుంకరిస్తాడు.)

అన్నపూర్ణ : ద్వైపాయనా! ద్వైపాయనా! (ఆ స్వరం అవ్యక్తమధురం. వ్యాసుడు ప్రక్కకు తిరుగుతాడు. శాంతరసము మూర్తీభవించినట్లు అన్నపూర్ణ ప్రక్కనున్న సౌధద్వారంలో కనిపిస్తుంది. ఆమె చూపుల్తో ఒకవిధంగా వ్యాసుని కోపోద్రేకం సన్నగిల్లింది. అలాంటిముఖం అన్నపూర్ణది. వేదకాలపు ముత్తైదువులాగా వుంటుంది. పచ్చని శరీరం, నుదుట పెద్ద కుంకుమబొట్టు, చేతులకు కంకణాలు, పాదాలకు అందెలు, వేళ్ళకు మట్టెలు ఉంటాయి. చెంపకు చేరడేసి కన్నులు. 'వీణాక్వాణ పాణింధమమైన' ఎలుగు.)

వత్సా! (ఆపిలుపు లోని మాధుర్యంతో వ్యాసుడు నిలువున నీరౌతాడు.)

దే : కథ అడ్డు తిరిగింది.

నం : ఆ మహాతల్లిని చూస్తూవుంటే కడుపునిండుతూ వున్నట్లుంది.

దే : కవిత్వం!

అ : లోకాన్ని అర్థంచేసుకొన్న ఋషివి. మానవులకు ఆదర్శప్రాయుడివి! మానవకర్తవ్యం నిరూపించావు!

దే : రెండూ, మూడు, నాలుగు.

పై : ఏమిటీలెక్క ?

దే : విను, విను.

అ : విద్యాదాతవు! పైగా మహాకవివి. లోక సంగ్రహార్థం నీ యావచ్ఛక్తిని వినియోగిస్తున్నావు. నీ భుక్తికి కావలసింది చాల స్వల్పం. ఇంతవరకు సహించావు!

దే : తొమ్మిది.

నం : ఏమిటి తొమ్మిది?

దే : భిక్షానర్హతకు కారణాలు.

భృ : గుండెలు బ్రద్దలు చేస్తున్నావు.

దే : నేను కాదు, ఆ తల్లివాక్కులు.

అ : వత్సా,ఇంకా ఆలస్యం దేనికి? నేడు నీకు మాయింట భిక్ష. మావారు ఎదురుచూస్తూ వుంటారు.

వ్యా: (ముఖం ప్రక్కకు తిరిగే వుంటుంది) నాకే భిక్ష! (ఒక్కొక్క అక్షరం ఉచ్చరిస్తాడు.)

అ : (జైమిని ప్రక్కకు తిరిగి) మీకు కూడా.

జై : గురుకులంలో చాలమంది ఉన్నారు.

అ : మీ గురుకులవాసుల్ని అందర్నీ ఆహ్వానిస్తున్నా. వేళ అతిక్ర మిస్తూ వుంది. పాపం, ముఖాలుకూడా వాడినట్లున్నాయి.

దే : (బాధతో మెల్లగా) ఖూనీ! ఖూనీ! త్రాచుపాముకోరతో హృదయాన్ని గుచ్చి ఎత్తుతూ వుంది. ఈ దాక్షిణ్యం కంటె మరణం మేలు.

అ : రండి, ఆలస్యం దేనికి? (ఆ ప్రశాంతంలో నడుస్తూ వున్న ఆమె పాదనూపురాలు విషాదంగా ధ్వనిస్తుంటాయి. అందరూ విషాద ఛాయల్లాగా గృహంలోకి వెళ్లుతారు.)

3

[విశ్వనాథుని ఆలయం విశాలంగా వుంటుంది. ఆలయంలోని కంబాలు చక్కని శిల్పం చాటుతూ వుంటాయి. అరటాకులు పరచి వుంటాయి. దేవలుడు, భృగువు, వైశంపాయనుడు, ఒక ప్రక్క కూర్చుంటారు. జైమిని వ్యాసునికి దగ్గరలో కూర్చుంటాడు. మిగిలిన బ్రహ్మచారులంతా ఒక ప్రక్కన కూర్చుంటారు. అన్నపూర్ణ వడ్డన సాగించబోతూ వుంటుంది.

ఇంతలో కాశీపతి విశ్వనాథుడు ఒక్కసారి ఊడిపడతాడు. ముఖం జేవురించి వుంటుంది. తొలకరిమబ్బుల్లో కునికేరాయంచ లాగ జటాజూటంలో తురిమివున్న చంద్రరేఖ చలిస్తుంటుంది. ఒడలినిండా విభూతి. కాలకంఠకఠోర నీలిరేఖలు ప్రచరిస్తూవుంటాయి. నిర్నాభి బిలంగావున్న వీగు బొజ్జమీాది కాషాయవస్త్రం జారుతుంది. ప్రమథ నాథుడు శస్త్రధారియై వెనుక ఉంటాడు. అంతా సంభ్రమంతో లేచి నిలబడతారు. వ్యాసుడు మేరుశిఖరం లాగ వుంటాడు.]

విశ్వ: తుచ్ఛుడవు, నీచాతినీచుడవు. నీ ముఖం చూస్తేనే పాతకం చుట్టు కొంటుంది. ఎంత కాలంనుంచో నీకు, నీగురుకులానికీ భిక్షాదానం చేస్తున్న యీ పునీతనగరాన్ని ధ్వంసం చెయ్యటానికి సిద్ధ మయ్యావు. నీవంటి కృతఘ్నుడు ఇంకొకడు లేడు. ఒక రెండు

పూటలు భిక్ష దొరకకపోతేనే నాశనం చెయ్యటానికి సిద్ధపడ్డావు. ఈ పురాతన పట్టణాన్ని, ఈ విద్యానిలయాన్ని పేరైనా లేకుండా చేయదలచావు. నిన్ను ఇన్ని సంవత్సరాలు పోషించినందుకు ఫలితం? ఏమన్నావు?మాభూత్త్రిపూరుషం ధనమ్! ఈ భూస్వర్గంలో నీవు ఉండటానికి యోగ్యుడవు కావు. (కోపావేశంతో మాటలు రాక తీవ్రంగా చూస్తుంటాడు.)

వ్యాసుడు దేవలుడు తప్ప తక్కినవారంతా (నమస్కారంచేసి) క్షమించండి, క్షమించండి.

విశ్వ: ఏది సహించినా అధర్మాన్ని క్షమించలేను. నా రాజ్యంలో వర్ణ ధర్మచ్యుతి జరుగుతుంటే సహించలేను. వేదాధ్యయనము, జపము, తపము, యోగనిష్ఠ మీకు నిర్దేశింపబడ్డాయి. అంతవరకే, మిగిలిన వాటితో మీకు నిమిత్తంలేదు.

జై : ఆకలిబాధ. ఏడురోజులనుండి తిండిలేదు.

విశ్వ: తిండిలేకపోతే! న్యాయాన్ని నీచేతుల్లోకి లాక్కుంటావన్నమాట!

దే : అధికార మత్తుడు మాట్లాతూ వున్నాడు. సంఘం యీ రాజుల్ని, యీధనికుల్ని తలదన్ని పోతుందని యీ మూఢునికేం తెలుసు?

వై : (దేవలుణ్ణి అదిమి పట్టి రహస్యంగా) ప్రాణాలు పోతాయి.

ప్ర. నా: (విని,) ఏమంటున్నావ్? నీతల వ్రక్కలు చేస్తాను. (కత్తి దూస్తాడు)

విశ్వ: ప్రమథనాథ్, ఆగు. ఈ విప్లవాన్ని అలా త్రుంచివేయటానికి వీల్లేదు. అ వెధవ బ్రతికికంటె చచ్చి విప్లవాన్ని సాధిస్తాడు. (ప్రమథ నాథుడు అలాగే నిలబడిపోయాడు.) నారాజ్యంలో అసలు విప్లవం తలఎత్తటానికి వీల్లేదు.

జై : (ఆశ్చర్యంగా) మేము విప్లవం లేవదీస్తున్నామా?

విశ్వ: (వ్యాసునివంకచూస్తూ) ఆ విషదావాగ్నినుంచి విస్ఫులింగాలు ఈ యెండుకట్టెల్లో పడలేదు. నయం. త్వరలో మేలుకున్నాం; లేక పోతే ......ఈదేశమంతా సంక్షోభించి పోయేది.

వ్యా: ఇప్పటికింకా మించిపోలేదు. నాగంటం వాడిగానే వుంది.

విశ్వ: (మండిపడుతూ) ఇక రెండుఝాములకు కాశీకి పది పదియోజ నాల దూరంలో వీరిలో ఎవరు కనిపించినా, వెంటనే శిరస్సు ఖండించివేయుడని నీ ప్రమథులకు చెప్పు. ఇది విశ్వనాథుని ఆజ్ఞ.

ప్ర. నా: చిత్తం.

వ్యా: ఇలాంటి మూర్ఖుని రాజ్యంలో మాగురుకులం ఉండటానికి యోగ్యం కాదు. మేమే ఈ దేశాన్ని బహిష్కరించ వలసివుంది. దేవలా! (వ్యాసుడు ఆలయం వెలువడుతాడు. దేవలుడు, జైమిని, నందీ శ్వరుడు, వైశంపాయనుడు, వెనుక బ్రహ్మచారులు, వారి వెనుక శస్త్రధారియై ప్రమథనాథుడు నడుస్తూ వుంటారు. ఎవ్వరూ మాట్లాడరు.)

నం: (బిక్కమొగంతో) ఇకమీద "శ్రీవిశాలాక్షి కెంజేతి భిక్ష" దొర కదు కాబోలు!

దే: భిక్షసంగతి ఎట్లావున్నా కెంజేతభిక్ష సంగతి ఆలోచించ వలసిందే.

[విశ్వనాథుని ఆలయంనుంచి ఘంటానాదం విషాదంగా వినబడు తుంది.

దే: ఏదో వినిపిస్తూవుంది!

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయేన మార్గేణ మహీం మహీశాః
గోబ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యం
లోకా స్సమస్తా స్సుఖినో భవంతు.
కాలే వర్షతు పర్జన్యః, పృథివీ సస్యశాలినీ.
దేశోయం క్షోభరహితో, బ్రాహ్మణాస్సంతు నిర్భయాః.

వ్యా: ఇదీ లోకం!

[తెర సవ్వడి లేకుండా జారుతుంది.]

—ఏప్రియల్, 1938.

# కావ్యాలలో నీతిబోధ

పువ్వులలో కొన్ని అందానికి ప్రసిద్ధి. కొన్ని వాసనకు ప్రసిద్ధి. కొన్ని యీ రెంటికీ ప్రసిద్ధి. ఈ కడపటివి చాలతక్కువ. మన దేశంలో వాసనగల పువ్వుల కున్న గౌరవం అందమైన పువ్వులకు లేదు. ఈ అర్థాన్నే, "వాసన లేని పూవు బుధవర్గము లేని పురమ్ము," అన్న ప్రాచీనోక్తి చాటుతున్నది.

అలాగే భాషాకృతులలో కూడ కొన్ని రామణీయకానికి ప్రసిద్ధి. మరికొన్ని ఉపదేశానికి ప్రసిద్ధి. ఒక కొన్ని యీ రెంటికీ ప్రసిద్ధి. రామణీయకాత్మక కృతులను కావ్యాలనీ, తత్త్వోపదేశాత్మకాలను శాస్త్రాలనీ, ఉభయాత్మకాలను శాస్త్రకావ్యాలనీ పెద్దలంటారు. వీనికి సంస్కృతంలోని రామాయణం, బ్రహ్మసూత్రాలు, మహాభారతం క్రమంగా ఉదాహరణాలు.

పువ్వుల అందం వేరు. వాసన వేరు. అలాగే కృతులలో కావ్యాలు వేరు. శాస్త్రాలు వేరు. అందం వాసన కాదు. వాసన అందం కాదు. అలాగే కావ్యం శాస్త్రం కాదు. శాస్త్రం కావ్యం కాదు. కావ్యానికి సహానుభవం, అపరోక్షానుభూతి ప్రధానం. శాస్త్రానికి పరామర్శం, పరోక్షానుభూతి ప్రధానం. హితమూ, నీతి, ధర్మమూ శాస్త్రానికి విషయాలు. కాబట్టి సాధారణంగా హితోపదేశం, నీతిబోధ, ధర్మ

